# ఆత్మబోధము

## పండితాభిప్రాయములు.

(i)

*Prof. Sir. S. Radhakrishnan, Kt. Spalding Professor of Eastern Ethics and Religions, University of Oxford.*

*5th May 1936.*

Though I have not had time to give the Telugu translation of *Atma Bodha* the attention which it deserves, I can, how-ever, say that the author's Telugu renderings are both readable and true to the original. The book will prove useful to all Telugu lovers of Advaita Vedanta. The author deserves to be congratulated on his excellent composition.

S. RADHAKRISHNAN.

(ii)

శ్రీమత్పరదేవతాయై నమః.

'ఆత్మబోధ' మనెడి శ్రీ శంకరాచార్యులవారి వేదాంత గ్రంథమును మిక్కిలి రమణీయముగా సుబోధముగా శ్రవణ పేయముగా శ్రీమోచర్ల రామకృష్ణయ్య (ఫస్టు గ్రేడు ప్లీడరు) గారు ఆంధ్రీకరించినారు. దీనిని అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి

గారు సుమారిప్పటికి ఇరువదియేండ్లనాఁడు ఆంధ్రీకరించినట్లు నే నెఱుఁగుదును. దానిని చదివి కూడ నున్నాను. ఎప్పుడో మేము కూడ పై గ్రంథమును కొంత అసంపూర్ణముగ నాంధ్రీకరించి యుంటిమి. ఆ గ్రంథ మసంపూర్ణస్థితిలోనే మా కల గూరగంపలో చేర్చి యచ్చొత్తింపఁబడి యున్నది. మఱి యెవరో కూడ దీని నాంధ్రీకరించినట్లును దానిని చదివినట్లును జ్ఞాపకము. వీరియాంధ్రీకరణము నేనెఱిఁగిన యాంధ్రీకరణములలో దేనికిని గాని తీసిపోదు సరి కదా, కొన్ని విషయములలో హెచ్చునేమో యని కూడ నాయూహ. భగవంతుఁడు వీరికింకను ఇట్టి సద్గ్రంథరచనకు ప్రోత్సాహకుఁడును, ఆయురారోగ్యభాగ్యప్రదాతయు నగుఁ గాక యని యాశీర్వదించుచున్నాను.

నెల్లూరు.
11—8—36.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.

(iii)

సంస్కృతమున శ్రీ యాచార్యస్వాములవారు వెలయించిన యాత్మబోధమునకు మీరు కావించిన తెలుఁగు నేఁతను నేఁడు మీనోరఁ దనివార వింటిని. తెలుఁగుఁ బద్యములు సంస్కృతశ్లోకములతీరును మించి మంచి నుడిపొంకముతో, ప్రసాదగుణముతో నొప్పారుచున్నవి. పరివర్తనప్రయోజనమీ మీరచనమున సరిగా సమకూడినదని నే సంతోషించితిని.

మూలార్థము మీపద్యములఁ గొన్నింట నించుక విస్తృతిం జెంది సుఖావబోధజనకముగా నున్నది. భవార్తులగు నాంధ్రు లీలఘుకృతి నమృతఘుటికగా నాస్వాదింతురని విశ్వసించు చున్నాఁడను.

వేటూరి ప్రభాకరశాస్త్రి.
27—5—1936.

(iv)

శ్రీరామ.

నెల్లూరు పురవాస్తవ్యులు మోచర్ల రామకృష్ణయ్య, బి. ఏ., గారు శ్రీశంకరభగవత్పాదాచార్యులు రచించిన "ఆత్మ బోధ" మను గ్రంథమును, తా మాంధ్రమున ననువదించిన దానిని, ఆదరమేదురమగు సోదరభావముతో నాకు వినిపింప నామూలాగ్రముగ విని యున్నాఁడను. ఆచార్యులవారి సంస్కృతరచనవలెనే రామకృష్ణయ్యగారి యాంధ్రపరివర్తనమును లలితపదవిలసితమై యొప్పారు చుండుటచే విషయగతమైన దుర్బోధత పాఠకుల కంతగాఁ గానరాక యాచార్యసూక్తుల నారయ నంతకంత కనురాగ మొదవించుననుట యథార్థకథనము. ఇందుఁ గొన్నిపద్యము లించించుక మూలమునకు వివరణప్రాయములయి విపులభావోపలక్షితములయి యున్నను, చాలవఱకుఁ బద్యములన్నియు మూలానుసారులై యెల్లవారి యుల్లములఁ బల్లవింపఁజేయునవియై యున్నవి. వేదాంతవిషయములను సుబోధముగఁ జదువరులచిత్తముల హత్తించుట

యందే కాక పదగుంఫనాదులగు రచనాచమత్కృతులయందును ఈగ్రంథమునందలి కొన్నిపద్యములు పోతనామాత్యునిపద్యములను బోలియున్నవి. శ్రీ రామకృష్ణయ్యగారు ఇట్టి సర్వజనోపయుక్తములగు నుత్తమగ్రంథముల ననేకములను రచియించి యాంధ్రసోదరుల నలరించుచు నాంధ్రభాషాభివృద్ధిఁ గావించున ట్లీశ్వరుఁ డనుగ్రహించుఁ గాత.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,

నెల్లూరు.
22—5—36.

**ప్రయాగ వేంకటరామశాస్త్రి,**
దత్తమండల కళాశాలాంధ్రపండితుఁడు,
అనంతపురము.

(v)

నెల్లూరు వాస్తవ్యులగు శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారిచే నాంధ్రీకరింపఁబడిన యాచార్యులవారి యాత్మబోధములోని కొన్నిభాగములను వారు చదువఁగా విని నే నత్యానందమును బొందితిని. ఇది సులభమై ధారాళమైన మృదుమధురశైలిలో రచింపఁబడినది. వేదాంతవిషయముల నిట్టి సుబోధంబగు సరళశైలిలో రచింపఁ గలిగిరనుట చేతనే శ్రీరామకృష్ణయ్యగారి కవితాశక్తి వ్యక్తం బగుచున్న దనవచ్చును. సామాన్యజనులు గూడ శంకరబోధనలను సులభముగా నవగాహన చేసికొనుట కీయాంధ్రీకరణ ముపయోగపడవచ్చునని నాతలంపు. ఇంక నిట్టిరచనలచే నాంధ్రభాషలోని వేదాంతశోభను వీరు వృద్ధినొందింతురు గాక.

28, Singarachari Street,
Triplicane, Madras.
27—5—1936.

**కోరాడ రామకృష్ణయ్య.**

# FOREWORD

BY

PROFESSOR D. S. SARMA, M.A.,

*Principal, Pachaiyappa's College, Madras.*

[Author of

"Introduction to Bhagavad-Gita"

and

"The Gita and Spiritual Life"

etc.]

# FOREWORD

The following pages contain a metrical translation of Sri Sankaracharya's Atma-Bodha into Telugu. It is well known that Atma-Bodha gives us a bare out-line of Sankara's philosophy which is revealed in its fulness in his famous commentaries. When one reads a poem of this kind, one is confronted with the question whether the author is teaching a doctrine or describing an experience. It is rather difficult to answer the question in the case of Sankara, for his modesty rarely allows him to lift the mask of the commentator and show us a glimpse of his personal experience. Like a true child of Hinduism, he almost always takes shelter behind our great mother—the immortal Sruti—whose nurslings we all are. It is only in some of his minor poems that we seem to come near his heart and discern how much of the flaming experience of the ancient Rishis he has made his own and feel that he is really a seer and a poet like them, though he is content to appear always in the guise of an interpreter. We some-times even feel that his is a voice in the wilderness, as it were, that he is a man from whose eyes the scales have fallen and that he speaks with passionate reiteration to the blind men around him of things which he sees and of the certitude of which he has no doubt. This great expansion of the spirit, he seems to say, this all-pervading consciousness, this transcendent Being in

which the ego is scarcely recognisable and where individuality has a new connotation—could this ever be the reward of anything that man can do? What is man's miserable endeavour, ethical, intellectual or ritualistic compared with this glory which is divine? Hence Sankara's sovereign contempt for human action as a means to Moksha. Like all the great mystics of the world he sets the life of contemplation above the life of action, and to drive his point home, he often exclaims that the two are as opposed to each other as light and darkness. The contradiction between Jnana and Karma in the teaching of the Hindu philosopher appears as the contradiction between grace and works in the teaching of the Christian apostle as well as of our own Bhakti schools. It evidently points to something fundamental in all religious experience—something which seems to snub the pretensions of ethics and promises to substitute immediate being for gradual becoming. None can appreciate this element in religion more readily than the moral man who has honestly tried to reach the ever-receding horizon of the ethical ideal. Countless years of groping could be covered in one flash of insight when the soul recognises in a moment the truth of all scriptures. It is a moment of death and resurrection, of renunciation and the tasting of life everlasting and a complete transvaluation of values. Until a man has some knowledge of this experience Sankara's repeated statements about Jnana and Ajnana, about

Paramatman and Jivatman, about Adhyasa and Upadhis, and his oft-quoted similes about the serpent and the rope, about the silver and the shell, would only appear as wearisome reiteration of an abstruse doctrine. But, in spite of the grave injustice which such a view involves to one of the greatest religious geniuses of the world, the acceptance of the doctrine on trust, like any mathematical or chemical formula, would greatly facilitate its verification in the heart at a later stage of one's spiritual development. As the Upanishad says:—

అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి.

The truth will dawn upon him who has faith in its existence.

A word might be said of the Telugu translation. In many stanzas the translation fits the original as a well-made glove fits the hand. Occasionally, however, owing to the demands of the metre, the translator feels compelled to expand a little the idea of the verse. But everywhere, as far as I am able to judge, the translation is not only faithful, but also flowing and musical. I hope in this beautiful garb, Atma-Bodha will become more popular in the Telugu country than it has been till now.

D. S. SARMA.

# అంకితము.



శ్రీమత్కావ్యకళారహస్యపదవీ
సిద్ధాంతముల్ సాధుచ
ర్యామర్యాద నెఱింగి శిష్యులకుఁ బూ
ర్ణప్రీతి బోధించు ప్ర
జ్ఞామాన్యుఁ బరతత్త్వవేత్తను సమ
జ్ఞాభూషణుఁ మద్గురు
స్వామిన్ సంస్మరియింతు సత్కవిని సు
బ్రహ్మణ్య దుర్భాన్వయున్.

కవితాకళావల్లికలకుఁ బందిలివెట్టి
పూఁవఁజేయు వసంతమూర్తి యంచు,
అంతేవసన్మానసాంతర్విలీనశ
క్తుల నిద్ర లేపు సిద్ధుం డటంచు,
భక్తిఁ బెద్దలఁ గొల్చి, బ్రహ్మానుభవమహా
ధ్వము నెఱింగిన తత్త్వదర్శి యంచు,
రసవద్విమర్శధూర్వహత సాహిత్యచా
తుర్యసంధాస్వతంత్రుం డటంచుఁ
గాంచిన యనూనగౌరవాకలనఁ జేసి
పౌరసమ్మానసభ, పురిం బరఁగువేళ,
అంబునిధి కర్ఘ్యమిచ్చు న్యాయంబు నెనసి
అంకితం బిత్తు గురున కీ 'యాత్మబోధ'.

# శు భా శం స న ము.



హితమతి నీకృతి యాపి
ష్కృతికిఁ దోడ్పడిన సుకృతి కిచ్చుం బరదే
వత ముంగమూరుకులమం
డిత వేంకటసుబ్బరాణ్మనీషికి శుభముల్.

# ఆశీస్సు.



ప్రాఁచెఁ గమ్మనిప్రాలు నీదుకవనం
పుందీవ; తావుల్ సము
త్కోచంబుల్; సరసాళులం దనుపువిం
దుల్ వాని క్రొందేనె, లో
మోచర్లాన్వయదీప! నీ రచనముల్
మోచాఫలప్రాభవ
ప్రాచుర్యంబులు, గానఁ ద్వత్కృతులకుఁ
బ్రహ్మాయురభ్యున్నతుల్.

శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

# ఆత్మబోధము.



తనరఁ దపం బొనర్చి దురి
 తక్షయసిద్ధి గడించినట్టి స
జ్జనులకు వీతరాగులకు
 శాంతమనస్కులకున్ విముక్తిచిం
తనుల కపేక్షణీయమగు
 తత్త్వముఁ దెల్పెద; బ్రహ్మవిద్య నా
ర్జన మొనరింప నిచ్చగల
 సాధువు లీకృతి నాదరింపుఁడీ! 1

ఎన్నఁగ వహ్ని పాకమున
 కెట్టులో, ముక్తికి నట్లె జ్ఞానసం
పన్నత ముఖ్యసాధనము:
 పాత్రముఁ గట్టెలు బియ్యమున్ జలం
బున్నను నిప్పు లేనియెడ
 నోగిరమున్ బడయంగ సాధ్యమే?
యెన్నఁటికైన ముక్తి లభి
 యించునె జ్ఞానము లేనివారికిన్? 2

అల కర్మమున కవిద్యకుఁ
గలుగదు వైరంబు కాన కర్మ మవిద్యన్
దొలఁగింప లేదు - జ్ఞానమె
వెలుతురు చీకటిని వలె నవిద్యను గెడపున్. 3

ఆత్మ తోఁచుఁ బరిచ్ఛిన్నుఁడటు లవిద్య,
నది నశింపఁగఁ గేవలుం డై వెలుంగు,
మొగులుమాఁత తొలంగఁగాఁ దగ స్వయంప్ర
కాశుఁడై తేజరిల్లు భాస్కరునికరణి. 4

జీవు నజ్ఞానకలుషంబు వోవఁజేసి
జ్ఞాన మావలఁ దాన నాశనమునొందు
సలిలమాలిన్యమంతయుఁ దొలఁగఁ జేసి
చిల్లగింజే యవలఁ దా నశించునట్లు. 5

సమధికద్వేషరాగాదిసంకులమ్ము
స్వప్నతుల్యమ్ము సంసృతిః సత్యమట్ల
తోఁచుఁ దనవేళ; బోధంబు దొడరినపుడు
కల్లయని స్పష్టమగును లోకమున కెల్ల. 6

అద్వయంబు సర్వాధారమైన యాత్మ
యెంత దనుక నెఱుఁగఁ బడ దంత దనుకఁ
గానఁ బడును జగత్తు నిక్కంబుగాఁగ
వెండిగా శుక్తి కనుపట్టు విధము తోఁప. 7

నాశరహితుండు సచ్చిదానందఘనుఁడు
నఖిలగతుఁడును నైన సర్వాత్మునందు
వ్యక్తు లెల్లను గల్పింపఁబడుచునుండుఁ
గంకణాదిభూషలు హాటకమునఁ బోలె. 8

పలు తెఱఁగులై రహించు నుపాధులందుఁ
గానఁబడును హృషీకేశుఁ డైనవిభుఁడు
గగనవిధమునఁ: దద్భేదకారణమున
భిన్నుఁడై తోఁచు, నవి పోవ వెలుఁగు నొకఁడె. 9

అఖిలమున కెవ్వఁ డాధారమై యొసంగు
నెవఁ డుపాదానమగు నా మహేశునందె
జగములు జనించి పెంపొంది క్షయమునొందు
సలిలమున బుద్బుదంబుల సరణి తోఁప. 10

కుల నామాశ్రమము లుపా
ధులవశమున నాత్మయందుఁ దోఁచుచు నుండున్
జలమున రసవర్ణాదులు
వెలయన్ బలుగతులఁ గానిపించెడురీతిన్. 11

పంచవిధవిభక్త పంచమహాభూత
సంభవంబు, గర్మసంచితంబు,
భూరిసౌఖ్యదుఃఖభోగాయతనమంచుఁ
దనువు చెప్పఁబడును దర్శనముల. 12

ఎనసి మనస్సు బుద్ధియు ద
శేంద్రియముల్ మఱి ప్రాణపంచకం
బును బనిపూని యుండు నెటఁ
బొందికగా, నయిదేసి పాళ్ల చ్చో
ప్పున విభజింపఁగాఁ బడని
భూతములందెది పుట్టు, సూక్ష్మపుం
దనువది భోగసాధన ము
దారత జీవునకున్ జగంబునన్. 13

పెంపున ననాదియై నిర్వచింపరాని
యల యవిద్యయె కారణోపాధి యగును
ఆత్మభిన్న మ్ముపాధిత్రయంబుకంటె
నని యెఱుంగును తత్త్వజ్ఞుఁ డైనవాఁడు. 14

పంచకోశాదియోగంబువలనఁ దోఁచు
నమలమగునాత్మ తత్తన్మయంబుగాఁగ
గరిమ వస్త్రాదివస్తుయోగమునఁ జేసి
స్ఫటిక మాయాగతులఁ గానఁబడినయట్లు. 15

కోశయుక్తుని దనువులాగుననె తోఁచు
నతని, నిర్మలుఁ డంతరుఁడైన యాత్మఁ
దవిలి యుక్త్యవఘాతసాధనల చేత
వేర్పఱుపఁదగుఁ బొట్టున బియ్యమట్లు. 16

అనయమును సర్వగతమయ్యు నాత్మ యెల్ల
యందుఁ గానంబడదు బుద్ధియందె గాక,
స్వచ్ఛమైనట్టి ముకురాదులంద గాక
కలయెడలఁ బ్రతిబింబముల్ గానఁబడునె? 17

పురమున వేఱువేఱ సచి
వుల్ భటులుఁ బరిపాలనావిధుల్
వెరవున నిర్వహింపఁ బృథి
వీపతి తద్వ్యవసాయసంగతిఁ
బోరయక చూచు పోలిక మ
నోవపురింద్రియ బుద్ధివృత్తివి
స్ఫురణకు సాక్షియై వెలయు
చుఁ బరమాత్మ సదా ప్రకాశిలున్. 18

వెన్నెలరేల మింటఁ బరు
వెత్తెడు మబ్బులఁ గాంచి 'వెఱ్ఱినా
గన్నలు' చేందమామ వడి
గాఁ జనుచుండె నటంచు నెంతు,రా
తెన్నున నింద్రియైకవికృ
తిఁ గని తద్గతులెల్ల నాత్మవే
యన్నభ్రమఁ వహింతు రక
టా! పరతత్త్వవిచారదూరగుల్. 19

అర్కునిప్రకాశమును జను లాశ్రయించి
తివిరి స్వీయార్థములఁ బ్రవర్తించుభంగి
నరయఁగా నాత్మచైతన్య మాశ్రయించి
తను హృషీకమనోబుద్ధులును మెలఁగు. 20

అమరు నవివేకమున గగనమున నీల
తాదు లారోపమొనరించునట్టు లొకట,
తను హృషీకగుణంబులఁ బనుల నములఁ
దైనయాత్మ కారోపింతు రజ్ఞు లెపుడు. 21

మానసోపాధి ధర్మంబులైన కర్తృ
తాదులు ప్రకల్పితము లగునాత్మయందు,
సలిలచలనాదికంబు లజ్ఞానవశత
వారిగతశశిఁ గల్పింపఁబడినయట్లు. 22

రాగేచ్ఛాసుఖదుఃఖముఖ్యములు జా
 గ్రత్స్వప్నభోగ్యంబులై
సాగుఁ బుద్ధియె కారణంబగుట, నా
 శంబై చేనుఁ సుప్తి, నీ
లాగౌటఁ సువివేకులైన విబుధుల్
 తద్ధర్ముల్ బుద్ధివే
యౌఁగా వాత్మవటంచెఱుంగుదురు స
 మ్యక్ జ్ఞానసంపన్నులై. 23

అర్కునకుఁ బ్రకాశ, మంబువునకు శైత్య
మగ్నికుష్ణతయు సహజములైన
యట్లె నిత్యసచ్చిదానందశుద్ధత
లాత్మకుఁ స్వభావమై యెసంగు. 24

ఆత్మదైన సచ్చిదంశంబు మఱియును
బుద్ధివృత్తి, రెంటిఁ బొసఁగఁ గూర్చి
వ్యవహరించు జీవుఁ డవివేకమునఁ దాను
బయలువెలి నెఱుంగువాఁడ ననుచు. 25

ఆత్మకు వికారమే లే దొకప్పుడైన,
బుద్ధికిని లేదు బోధమెప్పుడును గాని,
నేను గర్తను ద్రష్టను నిఖిలమెఱుఁగు
వాఁడనని జీవుఁడు సతంబు భ్రాంతినొందు. 26

రజ్జువును గాంచి పామని భ్రమయు పగిది,
తాను జీవుండనెడి భ్రాంతి తవిలి భయముఁ
బొందుఁ, 'బరమాత్మ నేను—జీవుండఁ గా'న
టంచెఱింగి విగతభయుం డగు జనుండు. 27

ఆత్మ యొక్కఁడ భాసిల్లు నట్లు నేయు
నెసయ బుద్ధ్యాదులను మఱి యింద్రియాదు
లను ఘటాదుల దీపంబులాగున నవి
జడము లాత్మను దోఁపింపఁ జాలవెపుడు. 28

అరయ దీపమునకు స్వాత్మప్రకాశార్థ
మన్యదీపమేల? యట్లె బోధ
రూపమైన యాత్మఁ దోఁపింప నన్యబో
ధేచ్ఛ వలవదనుట నెఱుఁగవలయు. 29

'నేతి-నేతి' యన్న నిగమసూక్తులచే ను
పాధులెల్లఁ ద్రోచి వైచి, పిదప
జీవుఁ డాత్మయును మహావాక్యములచేత
నేకమే యటంచు నెఱుఁగవలయు. 30

అరయంగాఁ దనుముఖ్యదృశ్యము లవి
ద్యాకల్పితంబుల్, విన
శ్వరముల్ బుద్బుదతుల్యముల్- విబుధుఁ డీ
సత్యంబు గుర్తించి య
క్షరమై సర్వజగద్విలక్షణమునై
. కాంతిల్లు బ్రహ్మంబు సు
స్థిరతన్ దానని దేశికోత్తముకృపా
దృష్టిన్ గ్రహింపందగున్. 31

జనన జరా కృశత్వ లయ
సంగతి లేదెపుడేని నాకు, నేఁ
దనువునకంటె భిన్నమగు
తత్త్వమ నౌట: నిరింద్రియుండఁ గా

పున మఱి యింద్రియార్థముల
    పొత్తును లేదని తత్త్వవేత్తయౌ
మనుజుఁ డెఱుంగుఁ గాని జడ
    మానసుఁ డెట్టు లెఱుంగఁ జాలెడిన్. 32

అమలుఁ డప్రాణుఁ డమనస్కుఁ డనుచు శ్రుతులు
నన్ను వాకొనుఁగాన, మనంబు లేని
నాకు రాగంబు ద్వేషంబు శోకమోహ
సంశయభయాదికములు లేశమును లేవు. 33

నిర్గుణుండ నరూపుఁడ నిర్మలుఁడను
నిర్వికార నిరంజన నిర్వికల్ప
నిత్యముక్తుండ నిత్యుండ నిష్క్రియుండ
నేనని యెఱుంగవలయు సుజ్ఞాని కెపుడు. 34

అంబరమువోలె బహిరంతరంబులందు
వ్యాప్తినొందినవాఁడ నే నచ్యుతుండ
సర్వసముఁడ విశుద్ధుండ సంగవిరహి
తుండ నచలుండ నెపుడు శుద్ధుండ నేను. 35

నిత్యమును ముక్త మేకంబు నిర్మలంబు
నద్వయ మఖండసుఖము సత్యము ననంత
మగుపరబ్రహ్మమును తానె యని యెఱుఁగుట
నిగమగూఢార్థ మెఱుఁగుట నిక్కవముగ. 36

ఈవిధి నే బ్రహ్మము నను
భావాభ్యాసమునఁ గలుగు వాసనయు, యవి
ద్యావిక్షేపములెల్లఁ
బోవంగాఁ జేయు రోగముల మందువలెన్. 37

విజనదేశమందు విజితేంద్రియుండయి
యమలమతి విరాగి యై యనన్య
బుద్ధి యై యనంతమును కేవలం బైన
తన్నుఁ దా సతమ్ముఁ దలఁపవలయు. 38

ధీబలంబుచేత ధీరుండు దృశ్యంబు
నెల్ల నాత్మలో లయింపఁజేసి
ప్రవిమలాంబరంబు వడువున నొకఁడైన
తన్నుఁ దా సతమ్ముఁ దలఁపవలయు. 39

బ్రహ్మవిదుఁడు రూపవర్ణాదికములెల్లఁ
ద్రోలఁగఁ ద్రోసి తాన వెలుఁగుచుండు
పరమ నిత్యసత్యపరిపూర్ణచిత్స్వరూ
పంబుతోడ, వేఱుపాటు లేక. 40

కనుఁగొనఁగ సత్యచిత్సుఖైకస్వరూపుఁ
డగుటఁ బరుఁడైన యాత్మునియందు జ్ఞాత-
జ్ఞానమును- జ్ఞేయమనెడి భిన్నతలు లేవు
తనకుఁ దానఁ బ్రకాశించుఁ దత్త్వమొకట. 41

ఆత్మ యనెడునరణి ధ్యానమన్ మథనంబు
చే నొగిన్ జనించు జ్ఞానవహ్ని
యెఱుకలేమి యనెడి యింధనమ్ము దహించి
బూదిసేయు దానిఁ బూర్ణముగను. 42

అరుణుఁడు ప్రాఙ్మహీధ్రశిఖ
రాగ్రమునం దుదయంబు నొందఁగా
నిరులు లయించి పోయెడువ
హిన్ విమలంబగుబోధపేర్మి స
త్వరముగఁ దా నవిద్య చేను
దవ్వగ; పిమ్మట నంశుమాలి య
ట్లరిదిగ నుద్భవించు తన
యంతన యాత్మ పటుప్రకాశతన్. 43

ప్రాప్తమే యయ్యు నాత్మ యన్వహ మవిద్య
వలన నప్రాప్తముగఁ దోఁచు, నల యవిద్య
తొలఁగ సంప్రాప్తముం బోలె వెలుఁగుచుండు
నమలనిజకంఠమణిభూషణము విధాన. 44

స్థాణువున పూరుషుఁడు వోలె తత్త్వమందుఁ
దవిలి జీవత్వమారోపితమ్ము భ్రాంతి,
జీవుతాత్త్వికరూపంబు చెలఁగి యెఱుఁగఁ
బడినఁ దద్భ్రాంతి మునుముట్టు నడఁగిపోవు. 45

భవ్యతత్త్వస్వరూపానుభవము వలనఁ
దనరు జ్ఞానము 'నే-నాది' యను నవిద్య
నొకట సద్యోవినాశన మొందఁజేయు
సూర్యునుదయంబు దిగ్భ్రమఁ జోపినట్లు. 46

తనయం దఖిలం బునికియు
ఘనముగ సర్వంబు దానొకండె యగుటయుఁ
గనుఁగొనును యోగి గురుకృప
జనిత మ్మగునట్టి జ్ఞానచక్షువుచేతన్. 47

ఆత్మయే యీజగత్తు సమస్త, మాత్మ
కంటె నన్యంబు లేదించుకైన, మన్ను
కంటె ఘట మెట్లు భిన్నంబు గాదొ యట్లె
అఖిల మాత్మగ నీక్షించు నాత్మవిదుఁడు. 48

ముందటి యుపాధిగుణముల డిందఁజేయు
టగును దెలియ జీవన్ముక్తిః యమలసచ్చి
దాది ధర్మత్వకలన బ్రహ్మంబు నొందు
భ్రమరకీటక్రమంబున బ్రహ్మవిదుఁడు. 49

ఘన మోహార్ణవముఁ దరించి, పటురా
గద్వేషముఖోగ్రదు
ష్టనిశాటప్రకరంబు నుక్కడఁచి, స్వే
చ్ఛఁ శాంతిసామ్రాజ్యల

క్ష్మిని జేపట్టి, వికల్పముల్ విడిచి, ని
శ్చింతతఁ సదానందని
త్యనిమగ్నస్థితి బ్రహ్మవేత్త తగ నా
త్మారాముఁడై భాసిలున్. 50

బాహ్య నశ్వర సుఖసక్తి వదలి యాత్మ
సదమలానందనిర్వృతిఁ సంతతంబు
ఘటగతంబగు దీపంబుకరణి నంత
రంబుననె వెల్గుచుండును బ్రహ్మవిదుఁడు. 51

ఆత్మవేత్త యుపాధిస్థుఁ డయ్యు గగన
మట్లుపాధిధర్మములచే నంటఁబడఁడు;
సర్వవిదుఁడయ్యు మూఢునిసరణి నుండు
సక్తి విడనాడి గాలియోజను జరించు. 52

అంబువున నంబు వభ్రంబునందు నభ్ర
మగ్నియం దగ్ని యెటులట్లు నైక్యమొందు
బ్రాహ్మణుఁడు నిర్విశేషమౌ బ్రహ్మమం దు
పాధుల సమస్తమును విలయంబొనర్చి. 53

దేనిం బొందుటకంటె లాభ మెపుడెం
దే వేఱుగా లేదో, యే
యానందంబున కంటె భూరితరమౌ
నానందమే లేదో, యే

జ్ఞానంబుఁ గనుకన్న ప్రాప్యమననో
జ్ఞానంబె లేదో, యదే
యానంచుఁ గ్రహియింపఁగావలయు బ్ర
హ్మంబుఁ విపశ్చిద్వరుల్. 54

ఏది దృష్టమైన దృశ్యమ్ము లేదింక,
నేది దైన భవము రాదు మరల,
నేది జ్ఞాతమైన లేదు జ్ఞేయం బింక
అదియె బ్రహ్మమనుచు నరయువలయు. 55

విగతద్వైతమునై వినిర్మలమునై
విజ్ఞానమై యూర్ధ్వతి
ర్యగధఃపూర్ణమునై యనంతమయి ని
త్యంబై చిదానందమై
యగుణంబై పొగడొందు నే దదియె బ్ర
హ్మంబంచు వేదాంతపా
రగుఁ డౌ దేశికుఁ గొల్చి యోగి పరమా
ర్థంబుఁ గ్రహింపందగున్. 56

వ్యయదూరంబయి శాశ్వతంబయి యఖం
డానందమై యద్వయం
బయి యొప్పారెడి తత్త్వమెయ్యది అత
ద్వ్యావృత్తిరూపంబుచే

త యథార్థాకృతి వర్ణితంబగును వే
దాంతంబులన్, దాని నా
రయ బ్రహ్మంబని సద్గురూత్తమకృపా
ప్రాప్తిన్ గ్రహింపందగున్. 57

అట్టిపరిపూర్ణసుఖరూప మైనయాత్మ
దైన యానందమున లేశ మాశ్రయించి
పరిమితానందు లగుచుంద్రు పాకశాస
నాబ్జజాదులు తారతమ్యములతోడ. 58

అఖిలవస్తులు తద్వ్యక్త మై యొసంగు,
నరయ వ్యవహార మెల్లఁ జిదన్వితంబు
కానఁ బాలను ఘృత మున్నకరణి సర్వ
గతమగుచునుండు బ్రహ్మ మొక్కటు సతంబు. 59

అనణు వస్థూల మహ్రస్వమై యదీర్ఘ
మై యజంబయి యవ్యయమై యరూప
మై యగుణమును నై యవర్ణాఖ్యమగు న
దెద్దియో యదె బ్రహ్మమం చెఱుఁగవలయు. 60

ఎది వెలింగెడి కతన నర్కాదిసర్వ
మును వెలింగింపఁబడుచుండు, నరయ నెద్ది
వానివలన వెలింగింపఁబడదు, దేన
నీసమస్తము వెల్గు నదే చిదాత్మ. 61

ఎట్టిగా నగ్నిఁ గాలిన యినుపముద్దఁ
బోలి, పరమాత్మ యంతరమునను బాహ్య
మునను వ్యాపించి వెల్గించుఁ బో సమస్త
విశ్వమును దానె స్వయముగా వెలుఁగుచుండి. 62

అరయఁగ జగద్విలక్షణం బాత్మ: దాని
కన్యమెద్దియు లేదు: బ్రహ్మంబు కంటె
నెవ్వి వెలుగఁ దోఁచు నవెల్ల మిథ్య
లెండమావుల సలిలమ్ము లెట్లో యట్లె. 63

ఎది కనఁబడు నెది వినఁబడు
నది బ్రహ్మంబునకు నన్య మగునది కాద
య్యది బ్రహ్మ మద్వయంబగు
చిదమలసుఖమనుచుఁ దత్త్వసిద్ధుఁ డెఱుంగున్. 64

సర్వగతు సచ్చిదాత్ముని జ్ఞానచక్షు
లైనవారలు చూతు, రజ్ఞాననేత్రు
లరయ నేరరు భాస్వంతుఁ డైనభాను
నంధు లీక్షింపఁగా నేరనట్టిపగిది. 65

కనకం బగ్నిపుటంబుచే మలవిము
క్తంబై ప్రకాశించురీ
తి నిరూఢిఁ శ్రవణాదిసాధనల ను
ద్దీపించు జ్ఞానానలం

బునఁ దప్తుం డయినట్టి జీవుఁడు మలం
బుఁ సర్వముఁ వీడి చే
య్యన భాసిల్లుఁ దనంతఁ దా విగళితా
హంకారుఁడై నిత్యమున్. 66

హృదయ మచుమింట నుదయించి యిరుల మాపి
సర్వమును నిండి సర్వంబు చేకొఁ దాల్చి
జ్ఞానభానుఁ డాత్మాకృతిఁ దాను వెలిఁగి
వెండి వెలిఁగించుచున్నాఁడు విశ్వమెల్ల. 67

అనవచ్ఛిన్నము దేశకాలములచే,
నద్వంద్వముఁ సర్వగం
బనవద్యంబు నిరంజనంబు సుఖదం
బయాత్మ తీర్థంబునం
దు నిమగ్నుం డగు నిష్క్రియుం డెవఁడు సా
ధుశ్రేష్ఠుఁ డాధీరుఁ డెం
దును సర్వజ్ఞుఁడు సర్వగుండు నమృతుం
డుఁ బూర్ణుఁడై భాసిలున్. 68

---

వావిళ్ల' ప్రెస్, మదరాసు.—1941.

# 'ఆత్మబోధ' కృతిసమర్పణమహోత్సవము

# గ్రహీతృకృతజ్ఞతోక్తి

## [శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు.]



మ. కడచెన్ ముప్పదియేండ్లు సద్గురుఁడు విజ్ఞానాధ్వమున్ జూపి, ము
గ్ధుఁడ, నించించుకగాని దారి తుదిగుర్తున్ గాన లేనైతి, శి
ష్యుఁడు నేఁడీ క్రియఁగ్రమ్మఱన్ గృతిమిషన్ సూచించెఁ గర్తవ్యమున్
బడయన్ నేర్తునొ లేనొ యింతటికి నైనన్ మచ్చిరాభీష్టమున్. 1

తే. విరిసినట్లుండు నొకవేళఁ, దరిచి చూడ,
బలసియే యుండు, నెఱుక నావలకు నెట్టి,
వెన్నెల రవంత, కొండంత వితత తమము
జ్ఞానమదియేడ ! నేనేడ ! శాంతియేడ ! 2

శా. శీతోష్ణంబులు, సంపదాపదలు, నాశీశ్శాపముల్, ఖ్యాత్యవి
ఖ్యాతుల్ తుల్యముగాఁగ, సర్వమును నిష్కంపంబు బ్రహ్మంబెగా,
భ్రాంతిన్ జూడఁగలేని వాని పటుశాస్త్రజ్ఞానమేలా ? వచ
శ్చాతుర్యం బదియేల ? యేల బహుభాష్యగ్రంథ వైదుష్యముల్. 3

చ. ఇది మది, యివ్వి యింద్రియము, లిద్ది యహంకృతి, వీనికంటె నె
య్యదనున నేను వేఱను రహస్యమెఱింగిన బ్రహ్మవాదియున్
వదలఁగ లేఁడుగా మొదటి వాసనలన్ మునుముట్ట నొక్కనాఁ,
డది ఘటియిల్ల కెక్కడి సమగ్రత, బ్రహ్మ సుఖాను భూతికిన్. 4

ఉ. శంకరు దివ్యవాక్కు ప్రభుసమ్మితమట్లు తలఁ ధరింతు, ని
శ్శంక తదీయ తర్కమణి సౌధములఁ జరియింతు నిచ్చలుఁ,
గొంకక తత్పదాబ్జములకుఁ బ్రణమిల్లుదు మూఁడువేళలఁ
శంకరుఁడే ప్రభుండు, శరణమ్ము, సుహృత్తు, గురుండు, నాకొగిన్.

మ. కలరో లేరో త్రిమూర్తు, లుర్వి మనుపంగా డిగ్గిరో లేదో? సా
ధ్యులు సిద్ధుల్ సుర లున్నవారొ మఱి లేరో? యెవ్వరేమైన, ని
ర్మల బోధామృతసేచ నోపశమిత త్రైలోక్య తాపత్రయుం
డలఘుగ్రంథ విధాత, శంకరుఁడు లేఁ డన్వాఁడు తా లేఁడుగా.

శా. అన్నా! మిత్త్రమ! రామకృష్ణకవి! నీ యౌదార్యముఁ మెచ్చుకోఁ
టి నీ యాకృతి "యాత్మబోధ"యయి శాంతిఁ గూర్చుతఁ నాకు; నీ
వు న్నాత్మార్థ బృహత్కృతి క్రియలఁ, బెంపుఁగాంచి మోచర్ల వం
శౌన్నత్యంబును నిల్పఁబెట్టు మఖిలార్య స్తోత్ర పాత్రుండవై.

స్వ స్త్య స్తు.

నెల్లూరు.
16-3-1941.